శ్రీ

# వ్యాసోదయము.

గ్రంథకర్త:

బసవరాజు సీతారామరావు,

యాడికి కొట్టాలపల్లె.

28_3_67



ముద్రితము:

భద్రావతి పవర్ ప్రెస్ - తాడిపత్రి.

రు 0-75

శ్రీ

# వ్యాసోదయము.

గ్రంథకర్త :

బసవరాజు సీతారామరావు,

యాడికి కొట్టాలపల్లె.

28-3-67



ముద్రితము :

భద్రావతి పవర్ ప్రెస్ - తాడిపత్రి.



# అంకితము.



శ్రీ చక్రముననుండి సిరులిచ్చు నేతల్లి
తన భక్తకోటికి దయ దలిర్ప
సకల గీర్వాణాంధ్ర సుకవీంద్రు లేతల్లి
చరణాబ్జయుగళ సంస్మరణ రతులు
ఆబ్రహ్మకీట పర్యంతంబు జననిగా
నేతల్లిని వచింతు నెల్లశ్రుతులు
ధగధగాయితరత్న తాటంకయుగళమే
తల్లికి కుముదబాంధవుడు రవియు
ఏజనని దివ్యపాద పంకేజ రజము
విబుధ కోటీరమణులపై విస్తరిల్లు
అట్టి శ్రీ మాతకిది మహాహార్ఘమొసవ
అంకిత మొనర్చుచున్నాడ నధిక భక్తి.

॥ శ్రీ ॥





# విజ్ఞప్తి.

శ్రీమదాంధ్ర మహాభారతము నందలి వ్యాసజనన ప్రతిపాదకమగు నితిహాసము నాధారముగా గొని "వ్యాసోదయ" మను నీ చిన్ని పొత్తమును రచించితిని. పద్య శతముగల ఈ కావ్యమును గుణగ్రహణ పారీణులగు సహృదయుల కరకమలములయందుంచు చున్నాడను. గ్రంధరచనమునకిదియే ప్రథమ ప్రయత్నమగుటచేత నిందు దోసగులుపొసగియున్నచో సాక్షాన్నారాయణమూర్తియు, బ్రహ్మర్షి శ్రేష్ఠుండును, నయిన శ్రీ వేదవ్యాసమహర్షి జననాత్మకమగు పుణ్యకథయని యైనను దీనిని సుజనులాదరింపక పోరని తలంతును.

ఈ గ్రంధమునుచూచి సంతోషించి యటనటగల దోషముల సవరించి యొసగిన బహు గ్రంథ రచనాకోవిదులును పూజ్యపాదులును నైన బ్ర॥ వే॥ విద్వాన్ శ్రీ జోస్యం జనార్దన శాస్త్రిగారికి కృతజ్ఞతాభివందనము లొనర్చు చున్నాను.

నేనడిగినదే తడవుగ వాత్సల్యమున తన యభిప్రాయము నొసంగిన సంస్కృత భాషా కోవిదులును, గురుతుల్యులును నైన బ్ర॥ వే॥ పురోహితం కృష్ణాచార్యుల వారి కనేక నమస్కృతు లొనర్చుచున్నాను. మరియు నీ కావ్యమునకు దయయుంచి "పరిచయము" ను వ్రాసిన విద్వచ్ఛిరోమణులును పూజ్యులును నైన బ్ర॥ వే॥ తిలకం తిరువేంగడాచార్యుల వారికి నమస్కార సహస్రములర్పించు చున్నాను.

అయాచితముగనే గ్రంథ ముద్రణమునకు వలయు ధన సాహాయ్య మొనర్చిన మా గ్రామవాసులగు మహాజనుల కితోధికైశ్వర్యాదికముల ప్రసాదించుగాతయని పరమేశ్వరు బ్రార్థించు చున్నాడను.

ఇట్లు,

కొట్టాలపల్లె.
28-3-67

గ్రంథకర్త
బసవరాజు సీతారామరావు.



పదజాలమ్ము, పదార్థబృందము మనోభావ ప్రసాదాళి సం
పదలన్ వ్యాసమహోదయంబలరి విద్వచ్చిత్తరాగాంబుధిన్
సదసద్జ్ఞాన వివేచనాఫలగతిన్ సద్యఃఫలంబిచ్చి త
త్ర్యదమంబందు శుభంబుగూర్చు సభ సీతారామ! వ్యాసోదయా!

తిరుపతి.
సరస్వతీవిహారం,
21-3-67

ఇట్లు,
సకల బుధజనవిధేయుడు,
చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మ.



# పరిచయము.

"కవితాయద్యస్తి రాజ్యేనకిమ్" అన్నట్లు సరస కవిత్వ మబ్బినచో కవికి నానందము పుక్కిటిబంటియగును. అంతే మాత్రమేగాదు సహృదయులకాయానందము తలమున్కలగును. "కవిఃకరోతికావ్యాని రసంజానాతిపండితః తరుః ఫలతి పుష్పాణి మరుద్వహతిసౌరభమ్." అన్నట్లు కవికి స్వకావ్య నిర్మాణజని తానందము కొంతకాఁగారసజ్ఞునకు తదనుభవజనితానందము అనంతమగును. కాఁగాసత్కావ్య రచనానుభూతుల వలన తులలేని యానందమనుభవసిద్ధము.

కావ్యములు ఆకారముచేతనే గాక రసభారముచేత నయితము మహత్వమును గడించుకొనును. "మేఘసందేశ" మట్టివానిలో నొకటి ఆ కావ్యమును మనసుననిడికొని పలువురు కవులు చిన్నారిపొన్నారి కావ్యములను రచించుట కుద్యమించు చున్నారు. అట్టివారిలో శ్రీ బస్వరాజు సీతారామరావుగారు నొకరు. వీరు వ్యాసమహర్షి జననసందర్భము నాలంబనముగా నొనర్చికొని తమ యీ కావ్య ఖండికను చిత్రించినారు. అందును నవకవుల పోకడలకుఁబోక ప్రాచీన కవితానియమముల నావం తయు జవదాటక తమ కవితాధారా విశేషముచే కావ్యమును కదంబింపఁజేసిరి. వీరు తమకృతిని తమ యిష్టదైవమగు శ్రీమాత కర్పించుచు పితృవందనమాచరించి పండితులకుఁ గేల్మోడ్చి కథా రంభ మొనర్చిరి.

"వ్యాసోనారాయణస్స్వయం" అన్నట్లు నారాయణ వాచకమైన "అ" కారముతో కావ్యము నారంభించి యమునా పవిత్ర తటమున శృంగారోద్దీపనమును నిరాఘాటముగ నొనర్చు వివిధ సందర్భములఁ బరిస్తావించి "రెండవయమునయో" "స్మరసరోజశరంబా" యనదగు మత్స్యగంధిని బరివేశ పెట్టిరి. ఇట్టుద్దీపనాలంబన విభావముల జతపఱచి తీర్థయాత్రా సందర్భమునఁ బరాశరునచ్చటికిఁ దెచ్చిరి. పై పరిస్థితులకుఁ దోడు ఏకాంతమున కాంతా దర్శనము ఆమె నౌకాచోదన నైపుణ్యము, శీతలజలవాయువులు, విహంగ మాలంకృతగగనములను వానినండఁగాఁగొని పూవిలుకాడు సమ్మోహనాస్త్రమును బరాశరుని హృదయమున గాడ నేసెను. ఆ దెబ్బతో నీ మునీంద్రుని చందమే మాఱిపోయెను. అంతనతడు మత్స్యగంధితోఁ దన మద్దు ముచ్చటింపఁదలచి ప్రసంగమున కవకాశము గలిగించుకొనుటకయి యామె పరిస్థితిని బరిస్తావించెను. ఆమె యుత్తరమునందుకొని తన యభిలాష నెఱింగించెను. మత్స్య గర్భమునఁ బుట్టిన నన్ను గోరఁదగునె? యని యామెయనఁగా ముని యామె జన్మవృత్తాంతమును దివ్యదృష్టిచే నెఱింగి యామె కెఱింగించుటయేకాక యామెకు యోజనగంధిత్వమును, కన్యకాత్వరక్షయుఁ బ్రసాదించి యామెను దనమనోరథమును దీర్పనూకొనఁజేసెను. తనవరమున నాపలైత విద్యుల్లతవలె జగన్మోహనాకారికాఁగా జూచి పరాశరుడు పరవశుడయ్యెను.

ఇది పట్టపగలనియు నిది జన సంకులప్రదేశమనియు దేశ కాలానౌచిత్యములను యోజనగంధి యోచనకుఁ దెచ్చువఱకు మునివరుఁడు గను వేదురున తమకించెను. అప్పటికి తెప్పరిలి యా క్రొత్త పెండ్లికొడుకు నీహార తిమిరమును గల్పించి తన యభీష్ట మును నెఱవేర్చుకొనెను. ఇచట యోజనగంధి పరాశరక్రీడలను వర్ణింపక మఱుఁగుపఱచి యౌచిత్యము బోషించుటయు, మఱియు నట నాంధ్ర మహాభారత పద్యరత్నములనే యందికొని యలంకరించుటయు, నీ కవికి నౌచిత్య పరిపాలనమునందు శ్రద్ధ యుఁ గవిత్రియమునందు ఘన గౌరవమునుగలదని వెలివఱచు చున్నవి. అచట వ్యాసోదయము శుభోదయమయి వెలయు చున్నది.

వ్యాసుని ప్రభావము, వ్యాస పుత్రుఁడగు శుకుని మాహా త్మ్యము ఈ కావ్యమునకు శిరోభూషణములై యొప్పుచున్నవి

ఇందు కవి ప్రాచీన గ్రంథములయందలి యనేక శ్లోకము లను యథాతథముగ స్వప్రతిభా విశేషముచే ననువదించి యిమిడ్చి కావ్యపుష్టిని గలిగించెను. అనువాదము సయితము సహజధారావిరాజితమై యొప్పుచున్నది.

మచ్చునకుఁ గొన్నిటిని గమనింపుడు.

“ వదనములు నాల్గులేని యామొదటవేల్పు.
బాహుయుగమున వెలుగు విశ్వంభరుండు.

క్రూర ఘాతేక్షణంబు చేకురని శంభుఁ,
డనఁగఁ బొగడొందె బాదరాయణుడు జగతి."

"ఉపనిషద్ద్వజంబు లుత్తమధేనువుల్,
చక్రపాణిదోగ్ధ, సవ్యసాచి
వత్సముగను, సూరివరులు భోక్తలుగాఁగఁ,
జెలఁగె "గీత" యనెడి క్షీరమవని."

ఇట్టివెన్నేనియుఁ నుదాహరింపవచ్చును. స్వతస్సిద్ధమయిన ప్రతిభా విశేషముగల యీ కవి పోయినపోకడ లితని భవిష్యదభివృద్ధికి నిదర్శనములుగా నున్నవి.

"కసటువోఁజేయు మిసమిస లెసఁగుమరుని
భాసురంబైన మోహన బాణమనగ"

లలన పొలిచినది.

"చంచలమనోజ్ఞ నయనవిశాలతయును
చంచలనుమించు నెమ్మేని చక్కఁదనము
చంచరీకవ్రజముల హసించుకురులు
చంచలమనస్కుఁగావించె సంయమీంద్రు."

ఇట సంయమీంద్రుని మనస్సునకు నయితము చాంచల్యము గలిగించుట కెంతటి ధ్వనిభావసామగ్రి సేకరింపఁ బడినదో గమనింపుడు.

ఇతర కవ్యనుకరణములు కవితాభ్యాసకులకు సాజముతే గానను, నట్టియనుకరణముల మూలముననే స్వతంత్ర కల్పనా సౌధము నధిరోహింపవలసియుండును గానను, అట్టి యంశము నిందు గుణముగనే సహృదయులు గ్రహింతురు గాక.

ఎట్లును ఈ "వ్యాసోదయము" ఆకారమునఁ జిన్న దయ్యు, నర్థగాంభీర్యమునను, కవితా గౌరవమునను, మహత్త్వమును వహించియున్న దనుటలో సందియము లేదు.

సహృదయులీ సరసకవి నాదరించి యాంధ్రభాషాయోష నితఁ డితోధికముగ నలంకరింపఁ గల్గునట్లు ప్రోత్సహింతురుగాక.

ఇట్లు,

చిత్తూరు. తి.కం. తిరువేంగడాచార్యులు,
26-1-67 ప్రధానమంత్రి.
సంస్కృతభాషా ప్రచారిణీ సభ.



# పండితాభిప్రాయములు.

రాయలసీమతల్లి చల్లనికడుపున పుట్టిన కవి కుమారులలో మా బసవరాజు సీతారామరావు గారుకూడ నొకరు. ఈ వ్యాసోదయపు వ్రాతప్రతిని చేతబట్టుకొని మొదట నాకగుపడిరి. ఆకారమును వాలకమునుబట్టి ఆతనిని కవికుమారు డనుకొనలేదు. పద్యములు పఠించువరకు నీతనిపలుకు లింతగా రుచివంతములై యుండు ననిపించలేదు ఈ సీమవారు నిరాడంబరులు నిండు కుండలు ననుటకు వీరు తార్కాణయగుదురు.

"వ్యాసోదయ" మాకృతియందనువయ్యు ద్రాక్షపండువలె చవులతో రసఘుటికి యనదగియున్నది. ఇతివృత్తముతో పాటు ప్రతివృత్తమును పవిత్రభావసంధుక్షణ ధవిత్రమన నొప్పారును.

పావకుడు సోమవేదిపై ప్రజ్వరిల్లు
పగిది నమ్మౌని కూర్చుండె పడవనెక్కి.

పరాశరుడు "సకలదృష్టిపథరోధి - తిమిర" మును కల్పించి - యనిమాత్రముచెప్పి, అమ్ముని శక్తిఁ సద్యోగర్భంబున వ్యాసు డుదితుండయ్యెఁ. అని భారతమందలి పద్యముచే ఉదహరించుట యితనిలోకజ్ఞతకు సూచిక. ఇదేకథను మరొకసామాన్యుడు చేప ట్టియుంకిన నెంతవిహ్యాముగా సొంతవర్ణనల చొప్పించి యుండునో?

వీరి కవితయందు అడుగడుగునను భారతీయత - ఆంధ్ర జాతీయతలు ప్రతీతములగుచుండును.

మానినీమణి మృదుమధురాధరముచూడ
హృదయమందనురాగ ముదయమయ్యె

అలంకారములపై ఈ కవికి మమకారము కలదుకాని అయ్యవి వికారములు కారాదన్న సంస్కారముకూడ కలదు.

"కాదంబరీ మహాగ్రంథ రత్నముబోలి
బహువిధాలంకార భరిత మగుచు"
"ఘనతిమో మగ్న లోకము నుద్ధరింపగా
జనియించు బాలభాస్కరు డనంగ.

ప్రాచీన గ్రంథములందలి సంస్కృత శ్లోకములను చక్కగా అనువదించి యుపయోగించుకొందురు.

"కోమలంబైన తీవనేకుజనుడైన
తడుపునే యుష్ణజలముచే?"
"సర్వవేదమయుడు సాత్వవతేయుండు"
"సరసిజాతాక్షు భుజచతుష్టయమనంగ"

ఇట్టి సహజసుందరమైన కవితతో సరిక్రొత్త కావ్యాలంకారము నలవరించి ఆంధ్రమాత నర్పించిన యీ కవికుమారుడు మున్ముందు మేల్మేలికైతసొమ్ములు ఘనమ్ములుగా కై సేయగలడని ఆశింపుచు అందులకు వలయు ఆయురారోగ్యానుకూల్యములు పరిసాదించుగాతయని పరమేశ్వరు ప్రార్థించుచున్నాను.

**తాడిపత్రి.** భాషాసేవకుడు.
**1-5-67** జోస్యము జనార్దనశాస్త్రి.

శబ్దార్థసహితమై పద్య శతముతోఁగూడి వ్యాసజననాత్మకమైన ఈ చిన్ని పొత్తమును డిలకించి యానందకందళితహృదయుడ నైతిని. ఇందలి పద్యములు హృద్యములై కవియొక్క నవ నవోన్మేష శాలినియైన ప్రతిభను వ్యక్తపరచు చున్నవి. ఇయ్యది మృదుమధురపద భూయిష్ఠమై, ధారాశుద్ధి కలిగియున్నదనుట యినుమంతయు నతిశయోక్తి కానేరదు.

"కవిఃకరోతికావ్యాని లాలయత్యుత్తయోజనః
తరుఃప్రసూతేపుష్పాణి మరుద్వహతిసౌరభమ్."

అన్నట్లు కవి తన మనోభావమును వాగ్రూపమున ప్రపంచింపక యుండలేడు. ప్రప్రథమమున రచింపబడినదైనను దీనియందు ధారాశుద్ధి వెలయుచున్నది. ఈ కవి ఇంకను వ్యుత్పన్నాభ్యాస ములను బడసి మున్ముందుత్తమ కావ్యములను రచించి భాషా సేవ నొనరించుగాతయని ఆశించుచున్నాను.

మద్దికెర.	ఇట్లు,
11-2-67	పురోహితం కృష్ణాచార్యులు,



# పి తృ వ ం ద న ము.



కలిగినదానిలోనె కడు కౌతుక మొందుచు

జీవితార్ణవం

బలయక నీది దాటి చనినట్టి మహా

మహితాత్ముడంచు లో

కులు పితృదేవ నిన్ను కడు కూర్మి

పడింబదిగా దలంచుచున్

పలుకుచునుందు రస్మదభివాదనముల్

గ్రహియింపు మింపుగాన్.



# పండిత వందనము.



నేర్చినవిద్య స్వల్పమని నెమ్మదియందు
దలంచియున్ జనా
భ్యర్చిత పాద పద్ముడగు వ్యాసుని
జన్మము వ్రాసినాడ నా
నేర్చిన భంగి దోషముల నిండు
మనంబున నోర్చుడంచు నే
కూర్చెద హస్తయుగ్మమును
కోవిదశేఖరులార భక్తితోన్.



శ్రీ

# వ్యాసోదయము.

అది యమునా పవిత్రతట, మప్పుడె గ్రుక్కెడు నీరుఁద్రావి స
మ్మదమునఁబోయె పైకెగసి మార్గముబట్టి విహంగమొండు పూఁ
బొదరుల సైకతస్థలుఁల పోఁకముఁగా ప్రియురాండ్రఁ జేరుచున్
ముదమున చక్రవాకములు ముచ్చటగా విహరించెనత్తఱిఁ.

2

చల్లనైయున్న సైకతస్థలములందు
వరమయూరంబులాడెడుఁ బురులువిప్పి
పల్లవములను మెక్కిన పరభృతములు
కుహుకుహూయని కొమ్మల గూరుచుండి.

3

పచ్చికపట్టులందుగల పచ్చని పచ్చికమేసి నీళ్ళులన్
హెచ్చుగఁద్రావి చూడఁగడుహృద్యమొనర్చుచు నాలమందలా
పచ్చని చెట్లనీడలను పయ్యరవీచుచునుండ గ్రేపులన్
మచ్చికపజ్జజేర్చికొని మైమఱపొంది పరుండియుండెడిన్.

4

పావనములైన యాశ్రమపాదపముల
పుష్పములతోడఁగూడిన పుణ్యాలతల
మునివరేణ్యులకావాస భూములగుచు
పరగుయమునా తటోభయపార్శ్వములును.

వేడ్క మునికన్య లాశ్రమ వృక్షములకు
చారుకలశచ్యుతాంబు సేచనమొనర్పఁ
బాదులం దంబుధారలు పడకమున్నె
వచ్చిత్రావును హరిణముల్ మచ్చికలర.

6

బ్రహ్మవిదులౌ మహాత్ములు బ్రహ్మఋషులు
సామ వేద మంత్రంబులు సస్వరముగ
గానమొనరింతురచ్చోట కంఠమెత్తి
పులకితాత్మీయ దేహులై పుణ్యమతులు.

7

వేదవిదులొక్కచో యథావిధిగ ఆజ్య
ధారలను హోమమొనరింప వారిదముల
బోలిలేచు ధూమముఁ జూచి పురులు విప్పి
లాస్యమొనరించు వర మయూరంబులచట.

8

కడచి పోయిన కథలెల్ల గర్భగోళ
మందుగలవేమొ గంభీరమైన నడక
నేత్ర పర్వంబుచేయుచు నీలరుచిని
యమున ప్రవహించు నాశ్రితయతిజన యయి.

9

కలువల కాముబాణముల కమ్మని తేనెల బింబికాఫలం
బుల నపరంజికుంభముల ముద్దుకనుంగవ చేత మూక్క చే
కలితవచో విలాసమున కమ్మని వాతెఱ నున్నత స్తనం
బుల నగుచెల్వునన్ మెఱుగుబోడియొకర్తుక యుండెనత్తటిన్.

10

రాజహంసల నడకచే, రమ్యపద్మ
ములను వదనంబుచే, ఫేనమును దరస్మి
తంబుచే, నూర్ములను వళీత్రయముచేత
అనుకరించుచు రెండవయమున వోలి
అచట నిలునుండియుండెనా హరిణనయన.

11

శైవలముతో బెనంగియు సారసంబు
రమ్యమగునట్లు మలిన మహాలాంఛనంబు
గలిగియు మనోజ్ఞుడగు శీత కరునియట్లు
మలిన వస్త్రంబుదాల్చియు మగువమిన్న
లలిత లావణ్యరాశియై యలరుచుండె.

12

చారుతర రూపసంపదల్ సహజభూష
ణంబులుగ నొప్పుచున్న యయ్యంబుజాక్షి
మత్స్యగంధి, ధర్మంబుగ మహితబుద్ధి
దాశరాజాజ్ఞ పడవనుదాగడపును.

13

చూచుచునుండె పద్మదళ సుందరలోల విశాలనీల దృ
గ్రోచులుపర్వగా స్మరసరోజ శరంబన నావనెక్కగా
వేచినవారి నయ్యమున వేగమదాటగ గోరువారి సం
కోచములేక యక్కుసుమకోమలి యానది యోడ రేవునన్.

14

భక్తమానస సరోవర హంసమై మోక్ష
దాత యెవ్వడతండు తాతతాత
జనియించె నెవనిచే జగములు పదునాల్గు

4

ఆతపోనిధి తన తాత తండ్రి
వరతపశ్శక్తి విశ్వామిత్రు నెవ్వాడు
గండడంచెనో యాఘనుండు తాత
నిగ్రహానుగ్రహోదగ్ర తేజశ్శక్తి
తపనాభుఁడెవ్వడాతండు తండ్రి
గాగ వెలుఁగొంది దనుజ సంఘముల హోమ
పావక జ్వాలలందు నపారశక్తి
ఆహుతియొనర్చి ప్రఖ్యాతినతిశయిల్లె
నెవ్వఁడట్టి పరాశరు డేగుదెంచె.

15

వచ్చెన్ జీకటులెల్లను
విచ్చెన్ రవివేగవచ్చు విధమున యమునన్
మెచ్చుచు నమందగతినా
సచ్చరితుడు తీర్థయాత్ర సలఁపుచు నటకున్.

16

యతిజనముఖ్యుఁడాతఁ డపుడయ్యమునా నదిదాటఁగోరి య
య్యతివను చూచియిట్లనియె "అంబుజపత్ర నిభాక్షి! దాటఁగో
రితినది ఆవలన్ గలుగు రేవును జేరగనీవునావ స
మ్మతినడపన్ బ్రమోదమగుమాకు యథేచ్ఛగబోదు" మంచనన్

17

ముదితమానసయగుచు నమ్ముదిత "స్వామి
వచ్చికూర్చుండుఁడిట మీరు మెచ్చునట్లు
పడవనడపుదు యముననిప్పుడె క్షణంబు
లోన దాటింతు" ననబొంగి మానసమున.

18

అధికదీర్ఘ జటాచ్ఛట లరుణకాంతి
పటలముల జ్వాలికఁ భంగి పరిఢవిల్ల
పావకుడు హోమవేదిపై ప్రజ్వరిల్లు
పగిది నమ్మౌని కూర్చుండె పడవనెక్కి.

19

దశ శతపత్రాబ్జముపై
విశదద్యుతి వెలుఁగు హంస విధమున శక్తి
ప్రశమిత సకలేంద్రియు డ
పృశుపతినిభుడుండ పడతి పడవను నడపెన్.

20

రేవునువీడి నావయట రేగు కరళ్ళనుచీల్చి మెల్లగా
బోవగ, గంధవాహములు పుణ్యనదీ జలపూరితంబులై
వీవగ, స్వేచ్ఛగా గగనవీథి విహంగములెల్ల చాలఁగా
బోవగ నెంతయున్ బ్రకృతిమోహనమై విలసిల్లెన త్తఱిన్.

21

జలజాప్తుని కిరణములకు
తళతళమని మెఱయు జలముఁదగ చీల్చుచు నా
యలలపయి దేలియాడుచు
లలనామణి నడప పడవలఘుగతి సాగెన్.

22

నావనల్లనద్రోచి నడపుచో కదలు ర
మ్యములైన విలసి తాంగముల సొంపు
ననబోడియయ్యు సునాయాసముగ నావ
నలఁవుమీఱగదానె నడుపు విధము
త్రోవకడ్డము వచ్చి తోడిబడు జలవిహం

గ్రశేణినదలించు కలరవంబు
ముఖమండలము ద్రిప్పి " మునివర్యభద్ర " మం
చని పల్కి కనుగొనునట్టి పలాయలు
చూడనొక నూత్న భావంబు సురుచిరముగ
హృది మెదలె చక్రధర దివ్య పద సరోజ
యుగసుధాపానచిత్తుడై యొప్పుచున్న
ఋషివరేణ్యున కదియె దైవేచ్ఛయేమొ.

23

శివుడు తనమేను బూదిసేసినది మొదలు
తాదృశులజూచి భీతిల్లు దర్పకుండు
తపసిభావోదయముగాంచి తలకులేక
తూణమునుండి తీసెదా బాణమపుడు.

24

జనరిహితమైన భూమి యుత్సాహజనక
మగు మనోహరప్రకృతియం దామెయచట
ఒకతెయే యుండుటయుజూచి యుద్యమించె
పంచబాణుండు మానిపై బాణమేయ.

25

ఏ బాణహతి నజుండెఱుక యించుక లేక
తనకూతుగలియంగ తమకపడియె.
ఏ బాణహతి నింద్రుడెఱుక యించుక లేక
" కొక్కొరొకో " యను కోడి యయ్యె.
ఏ బాణహతి సూర్యుడెఱుక యించుక లేక
వాజి రూపముదాల్చి వసుధజేరె.
ఏ బాణహతి చంద్రుడెఱుక యించుక లేక

గురుభార్య తారతోఁ గూడజాలె.
అట్టి సమ్మోహనాఖ్య ప్రఖ్యాతిగనిన
బాణమధిగతచాపుడై భావభవుడు
పార్శ్వసారించికూర్చి యమ్మౌనిహృదయ
కమలము శరవ్యముగ జేసి గాడనేసె.

26

మునివరుండయ్యు దైవేచ్ఛమనసుచెదర
అప్సరాశరుడేణాక్షి యవయవముల
నవకమునుజూచె నుత్ఫుల్లనయనుడగుచు
అనిమిషత్వంబుదాల్చెనో యనగనపుడు.

27

చంచలమనోజ్ఞనయన విశాలతయును
చంచలను మించు నెమ్మేని చక్కదనము
చంచరీకవ్రజముల హసించు కురులు
చంచలమనస్కుఁగావించె సంయమీంద్రు.

28

అతులమధుమాసవాస రోదితములైన
చారుతరనూత్న చూతపుష్పములమీఁద
వ్రాలునిందిందిరములునా వ్రాలెనప్పు
డతనిచూడ్కులు కాంతావయవములందు.

29

పికవరస్పర్శనొందక యున్న సహకార
పల్లవసదృశమహా వాతెఱకును
సుమగుచ్ఛములబోలి సుందరాకృతితోఁడ
శోభిల్లు పీనవక్షోజములకు

కమలంబులను మించి కడువిశాలములైన
చకితమృగీలోచనము లకును
రతివల్లభుని దివ్యరథచక్రమును బోలు
లలితని తంబమండలము నకును
బాలు నభిలాషతో మునిప్రవరుచూపు
లెంతవిజితేంద్రియుండయ్యు నెంతశాంత
హృదయుడయ్యు మునీంద్రుడమ్మదతజూచి
పరిసవసాయకదళిత హృత్పద్ముడయ్యె.

30

మానినీమణి మృదుమధురాధరము జూడ
హృదయమందనురాగ మొదవజొచ్చె
కాంచనాంగి వినీలకబరీభరము జూడ
మోహాంధకారంబు ముసురుకొనియె
నీరజాస్య విశాలనేత్రియుగ్మము జూడ
శృంగార రసమభివృద్ధియయ్యె
చపలాక్షి దరహాసచంద్రికారుచిజూడ
పరిణయసౌధం బభ్రిపథమునంటె
ఘన తపోధనుడయ్యునా మునివరేణ్యు
డపుడు ద్వైవేచ్ఛహృది కామమంకురింప
అప్ప వేయకజూచు నాయొప్పులాడి
యవయవంబుల మెచ్చుచు నాత్మయందు.

31

కాంచనగాత్రిమైసొగసుగాంచి కరంబుల కౌగిలించగా
నెంచు, నురోజకుంభముల నెంతయు ప్రీతిసతృష్ణమైవిలో

కించు, తదూరుయుగ్మమును కేల స్పృశింపగఁగోరి యాత్మనుం
కించు, ప్రియోక్తులం దనుప నెంచు ననంగవశీకృతాత్ముఁడై.

32

సరసుల తాసమానవిలసన్మృదుగాత్రిమనోజ్ఞలై న యు
చ్చరలనుజూచి యేఘనుడు చంచలచిత్తుఁడు గాకయుండె, అ
ప్పరమపవిత్రిమానసుడు పాయక కామవికారమప్పుడ
చ్చెరువుగనొందె, భావజునజేయ పరాక్రిము గెల్వ శక్యమే!

33

వదనమందు దాల్చె వనితామణిని ఒక్క
డురమునందు డాల్చె నువిదనొకడు
సగము దేహమిచ్చె సారసాక్షికినొక్క
డమరవరులె లొంగిరంగజునకు.

34

లలనలలితనూత్నలావణ్య మనువల
దగులుకొనియెనిల్లు తాపసేంద్రు
విమలవృత్తి మిగుల వెలుగు మానసహంస.
మదనుగెలువదరమె మానవులకు?

35

తనదుకోర్కె తెలుపదలచి పరాశరుం
డుదితరుచిర యౌవనోజ్వలాంగి
యైన మత్స్యగంధి యాననంబును జూచి
ఇంపుబొంపుమీఱ నిట్లు పలికె.

36

పడతి యెవ్వరిదానవిప్పుడవ నీవె
యొంటిగా నిట్లు నడపుచునుంటి విచట

అతులితోదార రాజభోగార్హ వనుచు
పాటలోష్ఠి నీముఖశోభ జాటుచుండె.

37

కరుణలేకుండ నెవ్వడీకరణి నిన్ను
పడవ నడపనియోగించె పడతిచెపుము
కోమలంబైన తీవనేకుజనుడైన
తడపునేయుష్ణజలముచే తలిరుబోడి.

38

అనిన నయ్యింతిపలికె సంయమివరేణ్య
నేను మత్స్యోదరమున జన్మించినాను
" మత్స్యగంధి " నామంబు సమ్మతినొనర్చి
తనయవలె బెంచె ప్రేమతో దాశరాజు.

39

దాశరాజు నన్ను ధర్మార్థముగ నియో
గించె పడవనడప నంచితముగ
అతనియాజ్ఞచేత యమునను దాటింతు
ననగ విని మునీంద్రుడనియె నిట్లు.

40

" చకితకురంగలోలసు విశాలవిలోచన " నిన్నుజూడ జం
కకమదనుండు సాయకనికాయము లేసి మదీయచిత్తమున్
గకవికబొందజేసె, కడగంట కనుంగొని నన్ను ధన్యగా
సకియయొనర్చి ప్రేముడినిచయ్యన దీర్పుము నాదుకోరికన్.

41

కుసుమకోమలినన్నట్టి కువలయాక్షి
మదన మార్గణవిదళిత హృదయుగాగ

జేయలేదెన్నడునుగాని చెలువమిన్న
నిన్నుజూచిన ధృతిదూలె నిక్కమిపుడు

42

అనిన వినియామె భీతినిట్లనియె నేను
నీచమగు మత్స్యమునకు జన్మించినాను
బ్రిహ్మవంశోద్భవులుమీరు పరమఋషులు
ప్రాకృతులబోలి మునివర్య పలుకదగునె.

43

బ్రిహ్మవిదులు తపోధనుల్ బ్రిహ్మసములు
సర్వలోకైకవంద్యులు స్వచ్ఛమతులు
భాగవతులిట్లు మత్స్యగర్భమునబుట్టి
నట్టి ననుకోరగా తగవగునె మీకు.

44

అనగ తుృటిలోనయత్తపోధనుడు దివ్య
దృష్టి పరికించిచూచి విస్పష్టముగను
తామరసనేత్రి జన్మవృత్తాంతమెల్ల
తెలిసికొని చిత్తమున నిట్లు తెలియబలికె.

45

మత్స్యగర్భంబునంద సామాన్యుడైన
పురుషవర్యు తేజంబున బుట్టినావు
గాన లలితాంగి బీజప్రిధానమైన
నీదు జన్మంబు దెలిపెద నిక్కమిపుడు.

46

శతమన్యుచే దివస్పతిచేత దేవత్వ
మెవ్వాడుబొందె నుర్వీశులందు

పాతాళబిలమున బడగ దైత్యులబాధ
పడకుండ చక్రిమెవ్వాని గాచె.
పతగేంద్రుడెవ్వాని పాతాళమున నుండి
తెచ్చినిల్పెను చేదిదేశమందు
" ప్రహ్లాదునట్ల మద్భక్తుండ " వని విరా
ధ్వజుడు వచించె నెవ్వానిగూర్చి
అట్టి దివ్య ప్రభావాఢ్యుడైన యుపరి
చరవసుండను భూమీశచంద్రమహిత
తేజమున జేసి జన్మించితివి నిజంబు
మత్స్యగర్భంబునందు నోమందయాన

47

రాజవదన నీవు రాజతేజంబున
బుట్టినావు మత్స్యమునకు నిజము
కాన దివ్యశోభ కనులపండువుచేసె
నిన్ను జూచినపుడె సన్నుతాంగి

48

విచ్చిన సుమములబోలు వి
యచ్చర కన్యకలజూచి యచలుడనగునే
పచ్చ విలుకాని తూపుల
గ్రుచ్చగబడినాడ నిపుడు కువలయనేత్రా

49

నాదుకోర్కె దీర్చవలినాక్షి సంతోష
జలధి దేలజేయు శంకవిడిచి
కరుణతోడజూడు కడగంట నీవింత
భయము జెందనేల బాలయనగ

50

అమ్మునిముఖ్యు మాటవిని యయ్యబలామణి యిమ్మునీంద్రుకా
మమ్మును దీర్పకున్నను మ్రందగ జేసిన జేయు నుగ్రశా
పమ్మును నిచ్చియంచు మదిపంబిన భీతికలంగి యోడ దా
సమ్మదిరాక్షి రేవునకు నల్లన జేర్చుచు పల్కెనివ్విధిన్.

51

కన్యను నేను లోకు లతికల్మష శీలయటందు రింతరా
జన్యుడు విన్న నేమగునో? చన్నిభ వాదృశులిట్లు పల్కసా
మాన్యులపోలి దేహ మసమంజస మండజగంధయుక్తి సా
జన్య.విధాన యింతయువిచారము చేయుము జ్ఞానదృష్టితోన్.

52

నాదుకన్యాత్వమంతయు నాశమొంద
జనకునింటికి నేరీతి జనగనేర్తు
హృదయమందు విచారింపుమిది మహాత్మ!
సదయ హృదయంబుతోడ ప్రసన్నబుద్ధి.

53

అనిన విని యప్పరాశరుం డాదరార్ద్ర
హృదయు డయి యోడకోడకుమిదె మదీయ
ఘనతపశ్శక్తిచే కన్యకావ్రతంబు
చెడదుగాన మదిష్టంబు సేయుమిపుడు.

54

పొలతి నీదేహమందు మీనొప్పెల నశించి
సరససౌగంధ్య మొదవియోజనము వఱకు
గుబులుకొనునట్లుగాని దే, కువలయాక్షి!
వర మొసంగెద నా తపోబలముచేత.

55

యోచనసేయబోకు విడుమోట మదిష్టము జేయబూననే
నీచతలేక లోకమున నీచరితంబతి మాననీయమై
యోచపలాక్షి! యొప్పెసగు నున్నతిబొందుదు వించుకేనిసం
కోచములేక ప్రేమమెయి కోమలి దీర్పుము నాదుకోరికన్.

56

అనగనమ్ముగ్ధ యతనికిట్లనియె నపుడు
ఋషికులవతంస కరుణార్ద్ర దృష్టిజూచి
యెట్లు దోషాన్వితనుగానో యట్లుభవద
భీష్టమును దీర్చుకొనుడు నాయిష్టమిదియ.

57

రమణివచనంబు లమృత వర్షంబుబోలి
అతులితానంద మొనరింప హర్షహృదయు
డగుచు మునికులవర్యు డిట్లనియె మధుర
సరసభావ సమన్విత స్వాంతుడగుచు.

58

భామినీమణి మత్కృతాభ్యర్థనంబు
సత్యమగునట్లుగా జేయసంతసమున
దలచితివిగాన జగతి " సత్యవతి " యనగ
బరగ గలవింక జనులెల్ల ప్రస్తుతింప.

59

మత్స్యగంధంబు నశియించి మగువనీదు
దేహమున నుద్భవించుచు దివ్యగంధ
మొక్క యోజనము వఱకు నొలయుగాన
కాంతవిలసిల్లు " యోజనగంధి " యనగ

60

కనకమయములైన కమనీయభూషణా
వళులుగలిగి దేవవనిత లౌద
లలను నూపజేయులలిత సౌందర్యంబు
గలుగుగాక నీకు సలలితాంగి

61

దివ్యమయిన శ్రీగంధము
దివ్యస్రిజ్నివ హాములును దివ్యాంబరముల్
దివ్యాభరణంబులు గల
దివ్యస్త్రీయనగ వెలుగు దివ్య ప్రభతోన్.

62

అయ్యతివర్యుడీకరణి నాదరబుద్ధి వరంబులిచ్చెనా
తొయ్యలికప్పుడా తపసి తోరపుశక్తి జనించి దేహమం
దొయ్యన యోజనంబు వరకొక్కట గ్రందుకొనెన్ సుగంధమే
మయ్యెనొ మత్స్యగంధ; మెటులౌను వచింపతపః ప్రభావమున్.

63

మృగమదంబు గోరోచన మగరు పచ్చ
కప్పురము కుంకుమమును శ్రీగంధమందు
జేర్చి మేదించి స్త్రీ సృష్టి జేసెనేమొ
బ్రహ్మయన మించె పరిమళ భరితయగుచు.

64

రత్నమయములైన రమణీయమరకత
మయములైన కనకమయములైన
దివ్యభూషణముల దీప్తి పుంజములచే
కన్యవెలిగ దేవకన్యవోలి.

65

మునివరేణ్యుని మోహాబ్ధిమునుగ జేసి
విజయమొందిన మదనుండు విజయశంఖ
మునకు ముదితాత్ముడగుచువైచెనో యనంగ
మగువకంఠాన ముత్యాలమాల వెలిగె.

66

అరుణమణులచేత నమలినాష్టాపద
మయములగుచు కాంతిమయములైన
కంకణములు కాంత కరముల విలసిల్లె
దీప్తులన్నిదిశల తివిరిబ్రాక.

67

శింజితానర్ఘ్యమంజు మంజీరఖచిత
పద్మరాగోజ్జ్వలన్మణి ప్రభలచేత
వేష్టితాకారయయి జాతవేదునందు
సంవిశుద్ధాంగియగుచున్న చందమొందె

68

రమ్యములు నూత్నతప్తకార్తస్వరాభ
వర్ణములు సూక్ష్మములునైన వస్త్రములను
ఉదయలక్ష్మియనంగ నభ్యుదయమొంది
సరసిజాతాక్షి వెలిగె నప్సరసబోలి.

69

కసటువోఁజేయ మిసమిసలెసగు మరుని
భాసురంబైన మోహన బాణమనగ
లలితలావణ్య జలనిధి కలిగినట్టి
లక్ష్మియన శోభితాంగియై లలనబొలిచె.

70

70

"కాదంబరీ" మహాగ్రంథ రత్నముబోలి
బహువిధాలంకార భరితయగుచు
బుధనుత "శిశుపాలవధ" మహాకృతిబోలి
కనకాంబర మహత్వకలితయగుచు
సుందరంబగు "మేఘసందేశము" ను బోలి
హృస్థార వైభవోత్కృష్టయగుచు
శ్రీహర్షకవికృత శ్రీ "నైషధము" బోలి
భాసితాత్మానేక భావయగుచు
మేఘములనుండి వెలువడి మెఱుగు లడర
క్షితిని నిల్చిన చంచలాలతికయనగ
మానివర్య వరోద్భూతమహిమ సమధి
కోజ్వలాకారయగుచు నయ్యువిద వెలిగె.

71

మెల్లమెల్లగ యానావ మెలత నడప
రేవునకు జేరె, మోహాతిరేక మెసగ
జంటలుగ నక్కడక్కడ జలవిహంగ
చయము విహరించుచుండె ముచ్చటగనచట.

72

చాలదూర మేగి శాలికణంబుల
దెచ్చి కొమ్మమీదవచ్చి వ్రాలి
విహగ మొకటి ప్రియకు విందుసేయుచు నేమొ
కొసరి చెప్పుచుండె గుసగుసమని.

73

మృగములు ప్రియాళతరుపుష్ప మృదులరజము
దృష్టిపథరోధ మొనరింప దిరుగుచుండె

గంధవాహున కెదురుగా గలగలమని
జీర్ణపర్ణంబు లటనట చెదరిరాల.

74

మేఘఖండిక యొక్కటి మింటబోవ
గని శిఖావళసతిప్రియుగలసి యాడె
పల్లవాంకుర మునుజూచి పరభృతంబు
రాబిలిచె ప్రేయసిని కుహూరావములను.

75

కుసుమమను పాత్రలో ప్రియకూడి మధువు
నిండు వేడుక ద్రావుచునుండె తేటి
తియ్యమామిడి చివురుల తినుమటంచు
పిక మొసగుచుండె నెనరుతో ప్రియకు ప్రీతి

76

కుసుమగుచ్ఛంబుల నెడి వక్షోజములను
శ్లేష్మపల్లవ మధురాధరోష్ఠములును
గలిగి శోభిల్లు నా లతాకాంత లగమ
నమ్రశాఖాసమాలింగనమును బొందె

77

వారికణముల వహియించి వరమయూర
బర్హముల తో ట్టుపడుచు, పుష్పముల తావి
దాల్చి, స్పృశియించుచును దేవదారుతరుల
మందపవనంబువీచె నానందముగను.

78

నావనుండిదిగుచు నలినాక్షిఁజూచె ను
త్ఫుల్లనయనుడగుచు మునివరేణ్యు!

డది యెఱింగి యామె యధికలజ్జాభరా
వనత శీర్షయగుచు పలికెనిట్లు.

79

తిరుగుచున్నారుచూడుడీ తీరమందు
జనులు, గగనంబునందు భాస్కరుడు వెలుగు
చుండె నిప్పుడు మునిజనచండకిరణ!
భవదభీష్టంబుదీరు టే పగిదిజెపుమ.

80

అననవిని యప్పరాశరుం డతిముదమున
సరసిజాతాక్షి!మత్తపశ్శక్తి జూడు
మనుచు కల్పించె తత్క్షణంబున నె సకల
దృష్టిపథరోధి నీహార తిమిరమంత.

81

పరమేష్ఠికల్పుడగు న
ప్పరాశరుసమాగమమున పరమగుణైకా
భరణకు ననవద్య మనో
హరమూర్తికి సత్యవతికి నమ్మునిశక్తిఁ.

82

సద్యోగర్భంబున నహి
మద్యుతి తేజుండు వేదమయు డఖిలమునీం
ద్రాద్యుడు వేదవ్యాసుం
డుద్యజ్ఞానంబుతోడ నుదితుండయ్యెన్.

83

సద్వినుత చరితు డయ్యమ
నాద్వీపమునందుబుట్టి నలినాక్షునిభుం

డద్వంద్వహృదయుడగు కృ
ష్ణద్వైపాయనుడు యోగిసత్తము డయ్యెన్.

84

ఘనతమోమగ్నలోకము నుద్ధరింపగా
జనియించు బాల భాస్కరుడనంగ
నిగమాఖ్యకల్హార నివహంబు వికసింప
విలసిల్లు పూర్ణిమావిధుడనంగ
సర్వపురాణ సస్యము లుద్భవింపగా
బొలుపారు వార్షిక జలదమనగ
విబుధులానంద సంభృత మానసులుగాగ
గనవచ్చు కల్పవృక్షంబనంగ
ఇంద్రనీలమణిచ్ఛాయనెసగు మేన
కపిలవర్ణంబులగు జడల్ కాంతులీన
కృష్ణమృగ చర్మమునుదాల్చి విష్ణునిభుడు
సాంద్రతేజుండు వ్యాసము నీందుడలరె.

85

వదనములు నాల్గులేని యా మొదటివేల్పు.
బాహుయుగమున వెలుగు విశ్వంభరుండు.
క్రూరఫాలేక్షణంబు చేకురనిశంభు
డనగ బొగడొందె బాదరాయణుడు జగతి.

86

విద్వన్మాన్యుడు మేఘవర్ణుడు కృపాన్వీతుండు ధర్మజ్ఞుడు
ద్యద్విఖ్యాతతపః ప్రభావుడు సమస్తామ్నాయసారార్థ సం
పద్విజ్ఞానఘనుండు మానిజనతావంద్యాబ్జ సంకాశపా
దద్వంద్వుండు జగత్ప్రపూజితుడు వేదవ్యాసుడొప్పెంగడున్.

87

సర్వ వేదమయుఁడు - సాత్త్వత తేయుండు.
సర్వ దేవమయుఁడు - శార్ఙ్గపాణి.
సర్వతీర్థమయము - జాహ్నవీతోయంబు.
సర్వశాస్త్రమయము - జగతి గీత.

88

శార్ఙ్గి యవతారమని జనుల్ సంస్తుతింప
ఘనతర తపోబలంబుచే ఘనులు పొగడ
వేదపుంజంబు విభజించి వెలుఁగఁజేసె
జగతి సురపూజితుఁడు పరాశరసుతుండు.

89

రత్ననూపుర ఝుళఝుళారావ మెసఁగ
తనదుజిహ్వాగ్రమున వాణి తాండవింప.
సకలలోకహితార్థియై సర్వధర్మ
మూర్తి పదునెన్మిది పురాణములనొనర్చె.

90

ధర్మములు తీర్థఫలములు ధరణిపతుల
చరితములు, భూఖగోళాదిచరితములును.
జను లెఱుంగుటకయి మానిజనవరేణ్యుం
డలఘు డష్టాదశపురాణములనొనర్చె.

91

నారదోక్తి సమీరణప్రేరిత మయి
మహితసాత్త్వత తేయూభ్రమండలంబు
పృథివి భాగవతామృత వృష్టిఁగురిసె
జనభవారణ్య పావకజ్వాల లడఁగ.

92

దితిజరిపుపాదములబుట్టి దివిజగంగ
పుణ్యమొసగు నాశ్రితపాప పుంజ మడచి
వ్యాసముఖజాత భాగవతాఖ్య గంగ
మోక్షమొసగు పితరులకు నక్షయముగ.

93

నిగమకల్పవృక్ష విగళితమై, శుక
ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవతపురాణ పరిపక్వఫలమాత్మ
తాపముల నడంచు తాత్వికులకు.

94

పూర్ణిమాతిథికళల ప్రపూర్ణమైన
చంద్రబింబమునందుండి జాలువాఱు
అమృతమన వానిముఖపద్మమందు వెడలె
అతుల మజరామరము భారతామృతంబు.

95

ప్రతిదినము జేయు స్నానంబు పారద్రోలు
దేహముననున్న మలినంబు దేహులకును
సతము సేవింప భారతామృతమొసంగు
బ్రహ్మఋషులుండు పదముకైవల్యపదము.

96

ఉపనిషద్వ్రజంబు లుత్తమధేనువుల్,
చక్రపాణిదోగ్ధ, సవ్యసాచి
వత్సముగను, సూరివరులుభోక్తలుగాగ
చెలగె గీతయనెడిక్షీర మవని.

97

వేదములలోనిసారంబు వేదవిదుడు
జనహితముగోరి తెలిపె ధీశక్తి వెలుగ
తపము పెంపున బ్రహ్మసూత్రములయందు
క్షుద్రమతములు ధరణివిక్షోభ మొంద

98

సరసిజాతాక్షు భుజచతుష్టయమనంగ
కమలభవుని మనోజ్ఞ వక్త్రంబులనగ
నముచిసూదను హస్తిదంతములనంగ
శిష్యులతనికి నలువురు శిష్టవరులు.

99

పరమాత్మ తత్వంబు పరికించి తనలోన
హర్షాశ్రుకణముల నలరువాడు.
పరిధానములులేని పంకజాక్షులనైన
కనుదోయివిచ్చి కన్గొననివాడు.
కనకాచలము దెచ్చి కాళ్ళపై నిడినను
మృత్పిండమనియెంచి మెలగువాడు.
తన తండ్రి మొదలుగా ధరణిజీవులయందు
మమకారహీనుడై మలయువాడు.
సకలజనవందితమనోజ్ఞ చరణయుగళు
డుర్వి నవధూత శబ్దవాచ్యుండునైన
సుగుణమణిభూషితుండగు శుకమహర్షి
తనసుతుడుగాగ వెలసె నాధన్యమూర్తి.

100

వార్షికాంబుదమన వలనొప్పు దేహంబు
ప్రజ్వరిల్లెడు జటాపటలములును
విబుధాపగాజలాన్విత కమండలువును
బ్రహ్మర్షి గణసేవ్య పదయుగంబు
కృష్ణాజినాంబరావృతకటీతటమును
బ్రహ్మతేజముతోడ బరగుముఖము
కరుణామృతమునిండి దొరగెడినేత్రముల్
మానితంబగు స్వచ్ఛమానసంబు
కలిగి వెలుగుచు, శుకుడు, శిష్యులును, విప్రు
లధికభక్తి ని సేవింపనలరు యోగి
పుంగవుడు వ్యాసుడిచ్చుత పుడమికెల్ల
భాగ్యశుభ వైభవ ప్రాభవములుకరుణ.

శ్రీ

ఓం తత్సత్.



